# కవితా ఝరి

(కవితల సంపుటి)


రచయిత :

**కాలువ మల్లయ్య**



ప్రచురణ :

**జనహిత సాహిత్య సమితి**

కాశ్మీర్‌గడ్డ, కరీంనగర్ – 2

మొదటి ముద్రణ :– డిసెంబర్ 1983

ప్రతులు :– 1000

వెల : మూడురూపాయలు

ముద్రణ : శ్రీరామా ప్రింటింగ్ ప్రెస్

## అంకితం

రాత్రింబవళ్ళు రెక్కలు ముక్కలు చేసుకున్నా
డొక్కలునిండక అనివార్యంగా
పోరుబాట తొక్కుతున్న
అధోః జగత్సహోదరులకు-

రచయిత-

---

## విషయ సూచిక

# నా దొక్క మనవి

కాలువ మల్లయ్యగారి "కవితా ఝురి" ఆమూలాగ్రముగా చదివిన నా ఆనందానికి మేరలేదు. పర్వతాగ్రముల నుండి కదిలే ఝురీ వేగతుల్యంగా ఈ కవితాఝురి భావావేశంలో నడిచింది. ఎందుకు నడువకూడదు ? నడవాలి ! ఇంకా వేగం పుంజుకోవాలి. ఎందుకంటారా? మొత్తం ప్రపంచాన్ని భస్మీపటలంచేసే అణుబాంబులు సిద్ధంగా వున్నవి. యుద్ధం ఎప్పుడో ఏరోజో అన్నట్టుల అగ్రరాజ్యాలు రెండూ ఎదురుచూస్తున్నాయి. ఉన్మత్తతతో కూడిన యుద్ధోన్మాదులు వాటి నుపయోగిస్తే ప్రపంచం సర్వనాశనం కానున్నది. దాని నాపే శక్తి ఎవరికున్నది? ఒక కవి కలానికే వుంది. అందుకే అంటాడు కవి "మీ దేశపు అణుబాంబులు మానవాళి నంతటినీ మసిగా మార్చేస్తుంటే- మీరు కూడ శవాలల్లో శవాలై పోతారు." ఇదెంతటి గుర్తింపో చూశారా? ఇక అణుబాంబులుగల యుద్ధోన్మాదులు ఈ యుద్ధతంత్ర వ్యూహంలో చిక్కుకుంటారా? ఒకవేళ చిక్కుకున్నా తమ వినాశనాన్ని తామే కోరుకున్నట్లేకదా? అందుకే వాళ్ళను "ఒకవేళ భూగర్భ గృహాల్లో వుండి తల దాచుకున్నా, తర్వాత శవాల నేలుకుంటారా?" అని ప్రశ్నిస్తాడు. ఎంతటి యుద్ధోన్మాదియైనా కళ్ళు తెరవకుండా వుంటాడా? అందుకే ప్రపంచ రచయితలంతా ఏకమై ముక్త

కంఠంతో తమ కలం, గళం ఎత్తి యుద్ధోన్మాదాన్ని ఎండ గట్టవలసిన అవసరం ఎంతో వుంది.

ఈ కవితాఝురిలో ఇంకెన్నో విషయాలను తడుముతూ స్వదేశీ, విదేశీ దోపిడీ విధానాన్ని అటు కట్టించాడు.

కవితల్లో వీరి ద్వితీయ కావ్యకుసుమం. వీరి మొదటి కావ్యం 'కవితా సౌరభం' కంటే ఇది మూడు పూవులు- ఆరు కాయలుగా వుంది. ఈ కవి ఇంకెన్నో కావ్యరాజములను పండించి, ఆంధ్రమాత కంఠసీమ నలంకరించి, అట్టడుగున పడియున్న దళితవర్గాలకు మేలు చేకూర్చగలరని విశ్వసిస్తూ ఈ కవిని ఆశీర్వదిస్తూ శుభాకాంక్షల నందజేయుచున్నాను. వీరి 1981 రచనలకై ఎదిరిచూస్తూ—


ఎస్. కె. పిళ్ళె
కన్వీనర్,
జనహిత సాహిత్య సమితి,
కాశ్మీర్ గడ్డ, కరీంనగర్ — 2.

# నా మాట

"కవిత్వ మొక తీరని దాహం" అన్న మహా కవి మాట లెంత సత్యాలు. అభివృద్ధి నిరోధకులే బొమ్మ్మ విరుచుక తిరుగుతుంటే, దోపిడీదారులే పెద్దమనుషులుగా చలామణి అవుతుంటే, దేశంలో జరుగుతున్న ఎన్నో సంఘటనలు మనసుపై చెరగని ముద్ర వేస్తుంటే, కవ్వించి రెచ్చగొడుతుంటే, అన్యాయా ల్రకమాలు, అవినీతి విశృంఖల విహారం చేస్తుంటే, కూడు, గుడు లేనివారి హృదయఘోష వింటూ పెల్లుబికి వచ్చే భావపరంపరను అక్షర రూపంలో పెట్టకుండా ఎలా వుండడం? నేను గమనిస్తున్న ఆయా సమస్యలకు స్పందించి నాలో పెల్లుబికి వచ్చిన ఆవేశాన్ని, ఆక్రోషాన్ని, ఆవేదనను, ఆనందాన్ని, ఉద్వేగాన్ని నాకు తోచినరూపంలో ప్రకటించాను. ఇందులో కవిత్వమేవుందో, స్పష్టతేవుందో, ఏం వుందో- ఏంలేదో నిర్ణయించాల్సిందిగా పాఠకులకే వదలిపెట్టాను.

ఇందులోని కవితలన్నీ 1982 నవంబర్ నుండి 1983 డిశంబర్ వరకు రాసినవే. వాటిని రాసిన కాలక్రమంలోనే వరుసగా అమర్చడం జరిగింది. ఇందులోని కొన్ని కవితలను ప్రచురించిన చాటింపు, ప్రసారిక, జనధర్మ, రచ్చబండ, చిత్రిక, మనుగడ, అన్నపూర్ణ, జనహిత కవితా సంకలనం- పత్రికా సంపాదకులకు నా కృతజ్ఞతలు.

ప్రస్తుత దేశపరిస్థితిని చూస్తే "నిజంగానే నిఖిల లోకం నిండు హర్షం వహిస్తుందా?" అని మహాకవి శ్రీశ్రీ కొచ్చిన సందేహం రాకమానదు. మహాకవి కోరిన నిండు హర్షాన్ని నిఖిల లోకాని కాహ్వానిస్తూ అది కావాలని ఆశిస్తూ—

— రచయిత.



# 1. ఆసియాద్

మింగ మెతుకు లేకున్నా
మీసాలకు సంపెంగ నూనె
రాచుకొనీ తిరిగేటి
ఘనమైన సంస్కృతి మాది.

అప్పుచేసి పప్పుకూడు
ఆడంబరంగ తినుకుంటూ
డంబాలతో బ్రతుకునట్టి
మాదండి సంస్కృతి మాది.

లోన కుళ్ళు కంపున్నా
పైన సెంటు ఘుమఘుమలతో
గొప్పలు బహు చాటుకునే
దొడ్డవాళ్ళ దేశమిది.

గిట్టుబాటు ధరలులేక
రైతులెంత గింజుకున్న
పరదేశపు గోధుమాల
రెట్టింపుకు కొనె మంచోళ్ళం.

కరువు కాటకాలతోడ
దేశం సతమతమైనా
వరదలలో వేలమంది
ఘోరంగా చచ్చిన సరె,

కూడుగుడ్డ లేమిలేక
పడుకొనుటకు జాగలేక

ప్రజలు పాట్లు పడుకుంటూ
దీనంగా మాడిన సరె,

"అప్పు" పాదాల క్రింద
సామాన్యుడి బ్రతుకంతా
నలిగి నలిగి పోయినాసరె
పొగిలి పొగిలి యేడ్చినసరె,

అప్పులిచ్చె దేశపోళ్ళు
పెట్టినట్టి షరతులన్ని
నిర్లజ్జగ ఒప్పుకొని
దేశాన్నమైనా సరె,

ఆసియాడ్ నిర్మాణంలో
కూలివాళ్ళ శ్రమ శక్తితో
లక్షలార్జించె గుత్తదార్ల
బాగా బలిపించుటకై —

కోట్లకొలది ప్రజాధనం
ఎన్నెన్నో రూపాలుగ
అస్మదీయు లంత కలిసి
స్వాహా చేయుటకొరకై —

వేలకోట్ల అప్పుదెచ్చి
ఆటల నాడిస్తామూ
మా కీర్తిని దిగంతాల
వ్యాపింపగ జేస్తామూ. *

# 2. ఎలా రాయను దేశ భక్తి గీతం?

రాయాలని వుంది
దేశ భక్తిగీతం రాయాలని వుంది
దేశాన్ని వేనోళ్ళా కీర్తించాలని వుంది.

కాని —

కడుపునిండా కూడు పెట్టలేక
ఒంటినిండా గుడ్డ నివ్వలేక
రత్నాల్లాంటి బిడ్డలను
రాళ్ళపాలు జేస్తున్న
నా దేశ పౌరుల స్థితినిజూస్తూ

నా దేశాన్ని రత్నగర్భ యని కీర్తించాలా ?

దేశానికి వెన్నెముకలాంటి
అన్నదాతయగు రైతన్న
తన వెన్నెముకే విరిగిపోగా
అన్నంలేక అలమటిస్తుంటే

నా దేశాన్ని అన్నపూర్ణ యని కీర్తించాలా ?

ప్రతిభనంత ఉపయోగించి
రాత్రనక పగలనక కష్టపడి
పాము కుబుసంలాంటి
పట్టుబట్టలు నేచిన సాలెన్న
తన ఒంటినే గాలకొదిలి బాధపడ్తుంటే

నా దేశాన్ని ఏమని కీర్తించాలి ?

—కాలువ మల్లయ్య

పెళ్ళికెదిగిన ఆడపిల్లలకు
పెళ్ళిచేసే శక్తి లేక
విదేశాల కమ్ముతున్న
నిరుపేద జనాన్ని చూస్తూ
నా దేశాన్ని భాగ్యవంతమని పొగడాలా?

రాబందుల రాజ్యంలో
స్త్రీల మాన ప్రాణాలకు
దిక్కు లేక చస్తుంటే
నా దేశాన్ని పుణ్యభూమి యని పొగడాలా?

మహా మహా కట్టడాల
శిల్ప చాతుర్యాన్ని వర్ణిద్దామంటే
అట్టి కట్టడాల కొరకు
రాళ్ళెత్తిన కూలీల
శ్రమ శక్తే కనబడుతుంది.
ఎంతగా ప్రయత్నించి

దేశ భక్తి గీతం రాద్దామన్నా-
నిస్సహాయుల ఆర్తనాదాలు
శ్రమ జీవుల దీర్ఘ నిట్టూర్పులు
రాబందుల రాక్షస నృత్యం
దళారీల దోపిడి తత్వం
నా కళ్ళెదుట సాక్షాత్కరిస్తున్నాయి.

మరి___

ఎలా రాయాలి దేశ భక్తి గీతాన్ని?
ఏమని పొగడాలి నా దేశ భాగ్యాన్ని?*

# 3. పుణ్యం

గుడికి పొయ్యాడు గుర్నాథం
సకుటుంబ సపరివారంగా
కళ్ళు మూసుకొని,
ధ్యాన ముద్రలో మునిగాడు.

కాని—

ముందున్న నల్లని వెంకన్న విగ్రహానికి బదులు
వెనుక నిల్చున్న
తెల్లని పంజాబీ అమ్మాయే కనబడుతుంది.

కాలేజీ చదివే కూతురు
చేతులైతే జోడించింది కాని
ఎనుకెనుకకు చూస్తూ
పట్టెనామాల సామికి బదులు
ఫ్రెంచి కట్ మీసాల
బాయ్ ఫ్రెండునే
కళ్ళలో నిలిపి చూస్తుంది.

పాఠశాలకేగే పసివాడు
రెండు చేతులూ జోడించి
విగ్రహం ముందున్న పులిహోరనే
తదేకంగా చూస్తున్నాడు.

గుర్నాథం భార్య గోవిందమ్మ
పక్కన నిల్చున్న రాంబాయమ్మ
పట్టుచీర జరీ అంచులను
పరిశీలనగా చూస్తుంది.

—కాలువ మల్లయ్య

దేవుని ఏజెంటు పూజారయ్య
నెత్తిన శఠగోపం పెట్టి
జారిన పైట సవరించుకుంటున్న
పడుచావిడ ఒంపు సొంపులపై
దృష్టి నిలిపి మంత్రం పఠిస్తున్నాడు.
గుడికెళ్ళిన గుర్నాధం అకౌంటులో
ఎంత పుణ్యం జమ అయ్యిందో కాని
నెలాఖరు రోజుల్లో
పది రూపాయల కాగితం మాత్రం
అటోలకు, కొబ్బరికాయలకు
పదిలంగా ఖర్చయ్యింది—*

## 4. ఎన్నికల్లో

ఎన్నికల్లో ఎన్నికల్లో
ఎన్ని కల్లూ కుండలో
ఎన్ని సారా సీలలో
ఎన్ని బీరు బాటిల్లో
ఎన్ని బ్రాందీ బుడ్డులో
ఎంత విస్కీ పారునో
ఎంత రమ్ము కారునో
ఎన్నికల్లో ఎన్నికల్లో
ఎంత గందరగోళము ?
ఎన్ని ఖద్దరు బట్టలో
ఎన్ని మోసపు మాటలో

ఎన్ని బ్రతిమిలాటలో
ఎన్ని బూటక బాసలో

ఎన్నికల్లో ఎన్నికల్లో
ఎన్ని జిత్తులు? ఎన్ని ఎత్తులు ?
ఎన్ని జండా లచ్చునో
ఎన్ని పార్టీ లచ్చునో
ఎన్ని రంగులు మారునో
ఎన్ని సభలను జేత్తురో
ఎన్ని స్పీచుల నిత్తురో

ఎన్నికల్లో ఎన్నికల్లో
ఎన్ని మాయలు? ఎన్ని మహిమలు?
రోడ్డులేని పల్లెకైనా
ఎన్ని జీబూ లచ్చునో
ఎన్ని కార్లూ వచ్చునో
ఎన్ని స్కూటర్లచ్చునో
ఎన్ని మోటర్లచ్చునో

ఎన్నికల్లో ఎన్నికల్లో
ఎంత నంబర మచ్చునో?
ఊరి మొకము చూడనోడు
కాలు కింద పెట్టనోడు
కాలినడకన కదలివచ్చును.

—కొలువ మల్లయ్య

దండముల్ గై కొనేటోడు
వంగి దండాల్ పెట్టును.
ఆరితోరని పిలిచేటోడు
అయ్యా అవ్వని పిలుచును
పేదలం టెనె కసి రెటోడు
వాళ్ళ కాళ్ళకె మ్రొక్కును.

ఎన్నికల్లో ఎన్నికల్లో
ఎన్ని వింతలు? ఎన్ని వింతలు?
ఎన్నికల్ల రోజులల్లో
గంజి అంబలి లేని ఇంటికి
గరం మసాలొచ్చును.
పైన తాకని చేతిలోనికి
పచ్చనోట్లే చేరును.

ఎన్నికల్లో ఎన్నికల్లో
ఎంత గమ్మతు? ఎంత గమ్మతు?
ఓటు వేసేటంతవరకు
కూడు లేని పేదనైనా
కుబేరుడాని గౌరవింతురు.
ఓటు వేసినంక నెత్తికి
టోపిపెట్టి గౌరవింతురు.

ఎన్నికల్లో ఎన్నికల్లో
ఎన్ని ట్రిక్కులు? ఎన్ని మొక్కులు?

# 5. దగా

దగా దగా దగా దగా
అందరి నోళ్ళల్లో దగ
దేశమంత దగా దగా
విశ్వమంత దగా దగా.

భక్తి దగా, ముక్తి దగా
భగవాను పేరు దగా
ప్రేమ దగా, త్యాగం దగ
కీర్తి కయ్యె దగాదగా.

బంధుత్వ మమత దగా
మిత్రుత్వ నటన దగా
బంధు, మిత్రులంత దగా
పైసకొరకు పచ్చి దగా.

పేదల రక్తం త్రాగెడు
కామందు బ్రతుకే దగ
సోషలిజం బురఖా దగ
పేదరికం క్షాళన దగ.

దగామయ లోకమందు
మంచికొరకు వెదకుట భ్రమ
అణగి మణగి యుండుట వృధ
తిరగబడ్డ వదలును శ్రమ. *

—కాలువ మల్లయ్య

# 6. పోరాటం

పుట్టకముందే ప్రారంభమౌతుంది పోరాటం–
పోరాడుతూనే బయటకొస్తాడు జీవి
పుట్టుకతో ప్రారంభం జీవనపోరాటం
పోరాడుతూనే జీవిస్తాం
జీవితమే ఒక పోరాటం.

ప్రకృతి వైరుధ్యాలతో మనిషి పోరాటం–
వర్షాకాలం వేడి నీటికొరకు
మండని కట్టెలతో పోరాటం
వేసవికాలం చల్లని నీటికొరకు
మండే సూర్యుడితో పోరాటం
జీవితమంతా అడుగడుగునా పోరాటం.

వర్గ శతృవుతో నిరంతర పోరాటం–
వర్గరహిత సమాజానికై అంతంలేని పోరాటం
అంతర్గత వైషమ్యాలతో అంతులేని పోరాటం
అస్థిత్వం నిలుపుకోవడానికి అనితర పోరాటం
జీవితమంతా అవిరామ పోరాటం.

బ్రతుకడాని కొరక పోరాటం–
మనిషిగా బ్రతుకడానికొరక పోరాటం
"మనీషి" గా బ్రతుకడాని కొరక పోరాటం
జీవితంలో పోరాటం అనివార్యం
చరిత్రంతా పోరాటాల మయం
వర్గ పోరాటాలతో రక్తసిక్తం.

జీవితమే ఒక సంగ్రామమైతే_
సమసమాజ స్థాపనకై
వర్గరహిత రాజ్యంకై
అహర్నిశలు అవిరామంగా
పోరాటం చేస్తున్న వీరులను
పోరాటమే ఊపిరిగా జీవిస్తున్ని త్యాగపురుషులను
అరాచకవాదులంటూ
గొంతు చించుకుంటూ రెందుకు_
చేతకాని బడుద్ధాయులు? *

# 7. గతం _ వర్తమానం _ భవిష్యత్తు

నీకు గతం_

శ్రమ జీవుల రక్తాన్ని చెమటగా మార్చి
ఆ చెమటతో పునాదులు తడిపి
ఎముకలతో సౌధాలు నిర్మించి
శ్రమ శక్తిని దోపిడిచేసి
సామాన్యుల సమాధిచేసి
జీ హుజూర్లతో
వైభవోపేతంగా బ్రతికిన
స్వర్ణయుగం.

—కాలువ మల్లయ్య

కాని నా కది-

పర పీడన పరాయణంగా దర్శనమిచ్చింది.

నీకు వర్తమానం

అయోమయం

ఏమీ నిర్ణయించుకోలేని గందరగోళం.

కాని నా కది—

తరతరాల నీ దోపిడీకి సమాధి కడుతూ

ఆశామయ భవిష్యత్తు నిర్మాణానికై

పోరాడే వీరుల కాలంగా కనబడుతుంది

ఎడారిలో ఒయాసిస్సులా అగుపడుతుంది.

నీకు భవిష్యత్తు-

విలువ నీడలేని ఎడారి

కాని నాకది-

కష్టజీవుల రాజ్యస్థాపనకై ఎరుపెక్కుతూ

ధగధగా వెలుగుతున్న

కోటి సూర్యుల కాంతి పుంజంలా

దివ్యంగా అగుపడుతుంది.

అందుకే—

గతం నీది

వర్తమానం ఇద్దరి మధ్య ఘర్షణమయం

భవిష్యత్తు నాది. *

# 8. మూగజీవి

పాపం గొర్రె
కటికవాడు తనకు నోట్లో పోసిన బెల్లం పానకం
తియ్యగా ఉంతని భ్రమిసి
మహా సంబరపడుతూ
సంతోషంగా తల ఊపింది.
కాని ఆ మరుక్షణమే
తన తలపై
నిర్దాక్షిణ్యంగా
కత్తి వేటు పడుతుందని
ఆ మూగజీవికి తెలియదు.
హుకుం చెల్లదని తెలిసికొని
ప్లేటు ఫిరాయించిన యజమాని
పొగడ్తలకు నమ్మి
ఉబ్బిస్తే ఉబ్బిపోయి
ద్విగుణీకృతోత్సాహంతో పని చేస్తాడు కూలి.
కాని తన శరీరంలోని
ఒక్కొక్క రక్తపుబొట్టు పిల్చి
తనను నూనెతీసిన తెలకపిండిలా మిగులుస్తున్నాడని
తనలాంటివాళ్ళ శరీరాలను
పునాది రాళ్ళుగా చేసి
సౌధాలు నిర్మిస్తున్నాడని
ఆ అమాయక ప్రాణికి
అసలే తెలియదు. *

—కాలువ మల్లయ్య

# 9. ఆచరణ

బండెడు మాటలు వల్లించేకంటే
పిడికెడు ఆచరించడం మేలు
ఆశయాలు కలిగియుండటం మంచిదే
కాని వాటిని
చిత్తశుద్ధితో ఆచరించినవాడే గొప్పవాడు.

దేశ పరిస్థితిని చూసి
అధ్వాన్నంగా వుందని
అన్యాయంగా వుందని
అయ్యో అయ్యో అంటూ
గొంతు చించుకునేకంటే
మార్పుకు సహరించడం గొప్ప.

కలంపట్టి రాసేవాడికంటే
వేదికలెక్కి ఉపన్యసించేవాడికంటే
ఈ కుళ్ళు వ్యవస్థపై
తుపాకీ గురిపెట్టినోడే గొప్ప.

అందుకే—

ప్రపంచ వ్యాప్తంగా
సమసమాజ స్థాపనకై
తుపాకితో పోరు సల్పుతున్న
విప్లవ వీరులకు
నా జోహార్లు. *

# 10 హింస

హింస హింస హింస హింస
ఏది హింస ఏదహింస ?
ఓ బూర్జువ మేధావులార
కడుపులోని చల్ల కూడ
కదలకుండ బ్రతికేటి
ఓ పరాన్న భుక్కులార
ఏది హింస ? ఏదహింస ?

గాడిద సహనంతోడ
బానిసోలె పడియుండి
అణగి మణగి జీవించుటె
అహింసంటారా ?

అహర్నిశలు, అనవరతం
ఒక్కలు ముక్కలుచేసుక
కష్టపడీ, దోచబడీ
కడుపుమండి గుండె రగిలి
ఆకలి కేకలు వేయగ
తరతరాల దోపిడీని
యుగయుగాల అణచివేత
నెదిరించగ బొమ్మునిచ్చి
పోరాడే కిశోరాల

—కాలువ మల్లయ్య

న్యాయమైన పోరాటం
హింసంటూరా ?

జీవితంలో ఓడిపోయి
దీనులుగా హీనులుగా
బ్రతుకుబండి నీడుస్తున్న
బడుగు ప్రజల అండగుండి
వారి దీన స్థితికి గల
కారణాల విప్పిచెప్పి

రెండు రెండు నాల్గనీ
రెండు రెళ్ళు నాల్గనీ
సూర్యుడు పడమటుకాదు
తూర్పునె ఉదయిస్తాడనీ

నగ్న జీవనత్యాలను
నిర్భీతిగ నుడివినోడు
హింసావాదంటూరా ?

చెడిపోయిన చరణానికి
కుళ్ళిపోయిన భాగానికి
శస్త్ర చికిత్సను చేయుట
మానవాళి బాగుకొరకు
ఆరోగ్యవంత సంఘంకై
వ్యవస్థను మార్చ యత్నించుట
హింసంటూరా ?

ఏది హింస ? ఏదహింస ? *

# 11. మేధావులు

మా దేశపు మేధావులు— మహా గొప్పవాళ్ళు
ఇంజనీర్లు డాక్టర్లు— డాక్టరేటు డిగ్రీలోళ్లు
ప్రొఫెసర్లు రీడర్లు- ఫారిన్ రిటర్న్డ్ గాళ్లు
చేంతాడుకంటె పొడుగు- పట్టాలు బహుగ ఉన్నవాళ్ళు.
సైన్సు బాగ చదివారు— సైన్సు పెంచుకున్నారు
డార్విన్ సిద్ధాంతాన్ని- దర్జాగా చెపుతారు
అయిన్‌స్టీన్ థేరీని- ఆపోసన పట్టారు
మాడర్న్ మ్యాసంతా- మహా గొప్పదంటారు
ఫిజిక్స్‌నూ కెమిస్ట్రీని- పీల్చి పీల్చి తాగారు
ఏర్ కండిషన్ గదిలోనే— విశ్రాంతి పొందుతారు
యూఫోము బెడ్స్‌పైన్నే- ఊపిరి పీల్చుకుంటారు
సైన్సు యిచ్చె సుఖాలన్ని- సంబరంగ అనుభవిస్తారు
సైన్సేకద అన్నింటికి— మూలమనీ చెబుతారు.

కాని—

కుల సంఘాల్ పెడుతారు
మతమౌఢ్యం విడువబోరు
మూఢ నమ్మకాల ఊబిలోన- గొంతువరకు మునుగుతారు
పొద్దున లేవంగానే- శివపూజలు చేస్తారు
పంచాంగం చూడందే— అడుగు బయట పెట్టలేరు
దేనికైన భగవంతుడి— దయ కావాలంటారు.

తాము నడిపె ఫ్యాక్టరీలు
తాము నడిపె దవాఖాన్లు

—కాలువ మల్లయ్య

తాము కట్టె ప్రాజెక్టులు
పూజతో ప్రారంభిస్తరు.

కొబ్బరికాయ లంచాలతో- దేవుడిని ప్రార్థిస్తారు
ప్రమాదాల నాపుటకై— యజ్ఞాలను చేస్తారు
దైవానికి శాస్త్రానికి (సైన్సు)- లంకెను ముడిపెడుతారు
చదివిందేమో సైన్సు- హేతువాదమంటె పడదు.

రాయీ రప్పలపైన
పరలోకపు సుఖంపైన
చూపే శ్రద్ధలో కించిత్
మనిషిపైన చూపెట్టరు.

తాము నడిపె ఫ్యాక్టరీల్లో
తాము కట్టె ప్రాజెక్టుల్లో
తమ నిర్మిత బంగ్లాలలో
తాము తినే అన్నంలో
లక్షలాది శ్రమజీవుల
చెమటధార లున్నవనీ
ఎప్పుడు ఆలోచించరు.

బడుగు ప్రజల బాగుకొరకు
రక్తం చెమటగ మార్చి
సౌధాలను నిలబెట్టిన
శ్రామికుల మంచికొరకు
దేశంలో జనులంతా
సౌఖ్యంగా బ్రతుకుటకై
నూతన వ్యవస్థ స్థాపనకై

పాటుపడే వీరులంత
వీరి కంటి కగుపడరు.

ప్రాణరహిత విషయంపై
పరిశోధన చేస్తారు
తోటి మానవున్నిగూర్చి
చింతించగ వ్యైముండదు.

ఓహో మేధావులార
మీ మేధా సంపత్తినంత
ఉన్నత వర్గాలవారి
ఉంపుడుకత్తెగ మార్చిన
మీ బుద్ధుల నేమనాలి ?
మిమ్మెలాగ నిందించను ?

*

# 12. రచయితలారా!

ఆడదాని అంగాంగం- అందంగా వర్ణిస్తూ
ప్రేమ కథల మైకంలో- పాఠకులను ముంచేస్తూ
కాల్పనిక సాహిత్యం- భూత ప్రేత సాహితినీ
టండ్లకొలది వండేస్తూ

ప్రజల చైతన్యంపై
ఆలోచన శక్తిపైన
మత్తుమందు చల్లుకుంటు
కర్తవ్య విమూఢులను చేస్తు
దోపిడి వర్గాలవారి

—కొలువ మల్లయ్య

కొలువుచేస్తు కొమ్ముకాస్తు
డబ్బుకొరకు మీ మేధస్సు
మ్ముకొంటు జీవించే
ఓ వ్యాపార రచయితలార!
రేయనకా, పగలనకా
పొట్టయిన నిండని కూలికొరకు
అవిరామంగా పనిచేసి
చెమటోడ్చి అలసిపోయి
జీవితంలో మోదంలేక
ఖేదంతో బ్రతుకు గడిపే
ఆపన్నులార్త ధ్వనులల్లో
శ్రమజీవుల బ్రతుకుల్లో
మీరు రాసె రంగు రంగు
ప్రేమెక్కడ ఉంటదోయి ?

కండలన్ని కరుగంగ
బండలన్ని పిండిచేసి
ఆకాశ సౌధాలను
అందంగా నిర్మించి
తలదాచగ చోటులేని
ఫుట్ పాత్ జీవితాలు
మీ దృష్టికి అగుపడవా ?
దగా పడిన తమ్ముళ్లు
దగా పడిన చెల్లెల్లు
జీవన సంగ్రామంలో

ఘోరంగా ఓడిపోయి
నికృష్టంగ బ్రతుకుతుంటె
ప్రేమ కథలు రాస్తారా ?
ఊహల్లో బ్రతుకుమంటారా?

సైరన్ కూతతో మొదలిడి
గడియారంతో నడచీ
యంత్రంలో యంత్రంగా
పనిచేస్తూ పాట్లుపడుతు
యజమానుల బొక్కసాలు
నింపేస్తూ వస్తుఉండె
కార్మిక జీవుల బ్రతుకులు
మీా కంటికి కనపడవా ?

బాధామయ బ్రతుకుల్లో
భాగం కొంత పంచుకుంటు
వాళ్ళ స్థితికి కారణాన్ని
మూలంతో విడమిర్చి చెప్పి
కన్నీటిని తుడుచుటకై
వాళ్ళ కండగా ఉంటూ
శ్రమజీవుల చెమటలోన
శ్రమజీవుల రక్తంలో
కలాన్ని ముంచి రాయాలి
కలంతో పోరు సల్పాలి. *

—కాలువ మల్లయ్య

# 13. అమెరికోడ - రష్యోడా ?

ఓ అమెరికన్ రీగనయ్యా- సామ్రాజ్యవాద దానవుడా!
వెలిసిపోయి నెర్సిజెండ- పాలన సాగిస్తున్న
ఓ మిలిటరి ఆంద్రపోవ్- మోసగాడ కుత్సితుడా!

ఒకరేమొ ప్రజాస్వామ్య- మంత్రం వల్లిస్తారు
ఒకరేమొ సోషలిస్టు- ముసుగు వేసుకుంటారు
ఒకరిపైన ఒకరు పదును- కత్తులనే నూరుతారు.

ప్రపంచాధిపత్యంకై
ఆయుధాల పోటీతో

క్షణాల్లో ప్రపంచాన్ని- బుగ్గిచేసె ఆయుధాల
ఉత్పత్తిని చేయిస్తూ
విశ్వాన్నే ఆయుధాల- భాండాగారంచేస్తూ
ఏమి బావుకుంటారు ?

ప్రపంచాన్నే జయిస్తామని
ప్రగల్భాలు పలికినట్టి
గ్రీకురాజు అలెగ్జాండర్
నాజీ నియంత హిట్లర్
నర హంతక రాజులైన
రష్యా జార్జి చక్రవర్తి
చైనా షాంగ్ కై షేక్
ప్రజా ద్రోహ పనులుచేసి
మట్టిలో కలిసి పోలేదా ?

మారణాయుధాల సృష్టిస్తూ
క్షణక్షణం మరణభయం
అడుగడుగున ఆందోళన
భూగోళము నందంతటు
ఉద్రిక్తత నెలకొల్పుతు
రాజ్యమేలుతుంటూరా ?
మానవ కల్యాణంకై
పనికివచ్చె విజ్ఞానం
మానవ హోమానికయ్యి
వాడబడుతుంటె చూస్తు
వెర్రిగ నవ్వుతున్నారా ?

మీ దేశపు అణుబాంబులు
హైడ్రోజన్, న్యూట్రాన్ బాంబు
ఇంకెన్నో భయంకర బాంబులు
మానవాళి నంతటినీ
మసిగా మార్చేస్తుంటే
మీరుకూడ శవాలల్లో
శవాలై పోతారు.

మీకొరకై కట్టుకున్న
భూగర్భపు గృహాలల్లో
రహస్య మందిరాల్లో
తలలు దాచుకుంటరేమొ ?

—కొలువ మల్లయ్య

అణు యుద్ధపు పోరులోన
విశ్వమంత పీనుగుల
పెంటలయ్యి పోయినంక
శవాల నేలుకుంటారా ?
శ్మశాన రాజు లవుతారా ?

ప్రపంచ వ్యాపితంగ
రాజ్యాలను ఆక్రమిస్తు
యుద్ధాలను రెచ్చగొడుతు
ఆందోళన సృష్టిస్తూ
సామాన్యుల బ్రతుకులను
దుర్భరంగ మార్చుతున్న
మీ కుళ్ళు బుద్ధులను
కుటిల మన స్తత్వాలను
మీరు చేసె మోసాలను
మీరు వేసె ఎత్తులను___

థర్డు వరల్డు దేశాలు
ప్రపంచ పౌరులంత
ఆలస్యంగైనా సరె
అవగతం చేసుకుంటున్నయి.

మీ ఎత్తుల బుగ్గిచేయ
ఒక్కటయ్యి రానున్నవి. *

# 14. జాబిల్లి

జాబిల్లీ — ఓ అందాల జాబిల్లీ
వైశాఖమాసపు రాత్రుల్లో
పిండారబోసినట్టున్న వెన్నెల్లో
నులక మంచంలో పడుకొని
అమ్మ ఒడిలో తలపెట్టి
నాన్న తొడపై కూర్చొని
తాత భుజాలపై ఎగురుతూ
వాళ్లు చెప్పే కథలు వింటూ
నిన్ను చేరుకోవాలని ఎన్నో కలలు గన్నాను.
నిన్ను అందుకోవాలని నా చిన్ని చేతులు చాచాను.

పురాణాల్లోని రంకును
ప్రబంధాల్లోని బొంకును
రమ్యాతిరమ్యంగా వర్ణిస్తూ
నిన్నొక హీరోనుచేసి
విరహుల పాలిటి విలన్ని చేసి
మెచ్చుకుంటూ, తిట్టుకుంటూ
తెలుగు మాస్టారు చెప్పే కథలు వింటూ
నిజమే ననుకొన్నాను.

కాని జాగ్రఫీ మాస్టారు
నిన్నొక గ్రహమని చెప్పినపుడు
అయోమయం చెందాను.

—కొలువ మల్లయ్య

నిన్ను రాహుకేతువులు మ్రింగితే గ్రహణం వస్తుందని ఒకరు
నీకూ సూర్యునికిమధ్య భూమివస్తే గ్రహణం వస్తుందని ఒకరు
ఒకదానికి పొంతనలేకుండా మరొకరు చెబితే–

ఎవరిని నమ్మాలో తెలియక
తీవ్రాలోచనలో పడ్డాను.

కాని చంద్రగ్రహణంనాడు
తెలుగు పంతులూ, జాగ్రఫీ మాస్టారు
మైల స్నానాలు చేస్తుంటే చూసి
ముక్కుపై వేలేసుకున్నాను.

నీ చల్లని వెన్నెలను
వివక్షతా రహితంగా
అగ్రవర్ణాలపై అలగా జనంపై
పూరి గుడిసెలపై అంతస్థుల మేడలపై
సమానంగ ప్రసరిస్తున్న
నీ నిష్పక్షపాత బుద్ధికి
నా జోహార్లర్పించాను.

కొంచెం ఆలోచించే వయసులో
నీపై అమెరికావాడు
అడుగు పెట్టాడని తెలుసుకొని
పరమానందం చెందాను.

నిన్ను దేవుడనీ, దయ్యమనీ
తారతో రంకుగట్టి ప్రచారం చేసిన
పుక్కిడి పురాణ గాథలు
అసత్యాలనుకొన్నాను.

కాని ఓ శశీ !

మనిషి నీపై అడుగిడింతర్వాత
ఫోటోలుకూడా తీసింతర్వాత
నీపై మట్టినికూడా తెచ్చింతర్వాత
మనిషి గ్రహాంతర సీమల్లో
నివసించే ఏర్పాట్లు జరుగుతున్న తరుణంలోకూడా
మా దేశపు పురోహితులు
మా దేశపు వేదాంతులు
మా దేశపు స్వాములోర్లు
అమెరికోల్లు కనుక్కున్నది వట్టిదని
అసలు చంద్రుడు వేరే ఉన్నాడని
మూర్ఖంగా వాదిస్తుంటే
నవ్వాలో ఏడ్వాలో తెలియక అయోమయంలో పడ్డాను.

శశీ !

చిన్నప్పుడు నిన్ను చేరుకోవాలన్న నా కలను
నా మనిషి నిజం చేస్తుంటే
ఆనందిస్తున్నది నిజమే.

కాని— యుద్ధోన్మాదులు
ఈ భూమిని శ్మశానంగా మార్చి
నీపై అడుగిడి
నిన్నుకూడా కలుషితం చేస్తారేమోనని
ఆందోళన చెందుతున్నాను. *

—కొలువ మల్లయ్య

# 15. మధ్యతరగతివాడు

నేను చూసాను
భూమికీ ఆకాశానికీ కాక
నరకానికీ స్వర్గానికీ కాక
త్రిశంకు స్వర్గంలో వేలాడుతూ
కొట్టుమిట్టాడుకుంటూ
కడివెడు దుఃఖాన్ని కడుపులో దాచుకొని
ఏడువలేక నవ్వుతున్న
మధ్య తరగతి మందహాసాన్ని

నేను తిలకించాను
ఎన్నో సాధించాలని
కలల నెన్నిటినో కని
కలల్లో జీవిస్తూ
ఊహల్లో బ్రతుకుతూ
కలలు కల్లలుగాగా
నిస్సహాయంగా నిలుచున్న
ఊహాజీవి జీవితాన్ని.

నేను గమనించాను
గొర్రెతోక జీవితాలతో
అనవసర భేషజాలతో
ఆడంబరాల హోరులో
ఆచారాల జోరులో

ఉన్న దూడ్చుకపోగా
రసం పిండిన తొక్కలా మిగిలిన
ముతక జీవితాన్ని.

నేను చూస్తున్నాను
ఎదిగే పిల్లలతో
ఎదుగని జీతంతో
జీవితనౌక నీడ్వలేక
ఈడిగిల బడుతున్న
నిస్సహాయున్ని నిర్భాగ్యున్ని.

నేను తిలకిస్తున్నాను
కాళ్ళు కడిగి కన్యాదానం చేసినా
కట్నం చాలదని వెళ్ళగొట్టబడిన
చిన్నారి కూతురు బతుకు
బండల పాలవుతుంటే
నిస్సహాయంగా నిలిచిన
నిర్భాగ్య జీవిని.

నేను గమనిస్తున్నాను
కన్న కొడుకుపై ఆశతో
కష్టపడి చదివించి
కలెక్టరౌతాడని ఊహించి
కండక్టర్ కూడా కాక
రోడ్ల వెంట తిరుగుతున్న

నిరుద్యోగ కొడుకును చూసి
నిట్టూర్పులు విడుస్తూ
దీనంగా నిలిచిన
అమాయక జీవిని.

నాకు దృగ్గోచర మౌతున్నాయి
ఫైల్లలో ముఖం దూర్చి
పగలంతా పనిచేసి
ఆశామయ భవిష్యత్తుకై
గాజుకళ్ళతో ఎదురుచూసే
గుమాస్తా జీవితాలు,
అరువ చాకిరీ చేసినా
ఆఫీసర్లతో తిట్లుదిని
ఆలిపై విరుచుకపడి
ఆక్రోశాన్ని వెళ్ళగ్రక్కే
బడుగు జీవుల బ్రతుకులు.

నేను తిలకిస్తూ వున్నాను
జీవితమంతా పస్తులుండి
పైస పైస కూడబెట్టి
స్వంత ఇల్లు కలలుగని
ద్రవ్యోల్బణం గమ్మత్తులో
ధరల పెరుగుదల సుడిగుండంలో
చిత్తుచిత్తుగా ఓడిపోయి

తన జీవితకాలం సంపాదనతో
సిమెంటుకూడా రాదని తెలుసుకొని
దిగాలు పడిపోయి
వెర్రినవ్వు నవ్వుతున్న
గుమాస్తా బ్రతుకు బండారాన్ని.

నేను చూస్తూ వున్నాను
జీవితమంతా లెక్కలతో
కొసరి కొసరి ఖర్చుచేసినా
అర్ధాంగి జబ్బు పడితే
మందుకూడా యిప్పించలేక
చాలీ చాలని బ్రతుకీడ్చే
నా దేశ సగటు మనిషిని.

నేను చూస్తూనే వున్నాను
దినం దినం
బ్రతుకు దుర్భరమవుతూ
సమస్యల వలయంలో తంటాలుపడుతూ
అనివార్యంగా
పోరుబాట తొక్కుతున్న
నా దేశ ఊహా జీవుల్ని. *

—కొలువ మల్లయ్య

# 16. శ్రద్ధాంజలి

శ్రీశ్రీ — సిరీ సిరీ
శ్రీశ్రీ — విషం విషం
శ్రీశ్రీ — సిరీ విషం

శ్రీ అంటే సిరిసంపద
శ్రీ అంటే విషంకూడ.

"రాబోవు యుగం దూతలకు
నవ సమాజ నిర్మాతలకు
మనిషిని మనిషే దోచే
కుళ్లు వ్యవస్థను కూల్చే
అభ్యుదయ పథగాములకూ,

దీనులకూ హీనులకూ– బాధామయ జీవులకూ
పతితులకూ భ్రష్టులకూ– దగాపడిని తమ్ములకూ
నీపేరూ నీ ధ్యేయం
సిరి సంపద మూటే మరి–"

"పుట్టుకతో వృద్ధులకూ
నూతిలోని కప్పలకూ– ముద్ద రాతి చిప్పలకూ
సాంప్రదాయ పూబిలోన
విష సంస్కృతి పడగ క్రింద
కొట్టుకుంటూ వెలుగును
చూడలేని మూర్ఖులకూ
పరులను పీడిస్తు బ్రతికె
పరాన్న భుక్కు కొడుకులకూ–"

శ్రీశ్రీ నీ పేరన్నా
రాబందుల రెక్కల చప్పుడు
ఆకాశపు టంచులనుండీ
దిగివచ్చే రథచక్రాల ఘోషను
వినిపించే నీ కవనం
కదిలించే నీ కవితలు
విషంకంటె చేదే మరి.

శ్రీశ్రీ నువు లేకున్నా
నీ ఆశయ ముంటుంది.
కుక్క పిల్లనూ అగ్గిపుల్లనూ
కవితామయం చేసిన
నిన్నెన్నడు మరువబోము.

శ్రీరంగం శ్రీనివాస— నీ యశస్సజరామరం

భానూదయ మున్నంతవరకు
భూగోళంపై మనుషులు
సజీవంగ ఉండువరకు
నీ రచనలు బ్రతుకుతాయి
ప్రజలను తట్టి లేపుతాయి.

ఈ శతాబ్ది నీదంటూ
సగర్వంగ చెప్పుకున్న
నీదు వాక్కు పచ్చి నిజం.

ఈ శతాబ్ద మొకటెకాదు
వచ్చే శతాబ్దికూడ
నీదనె తీర్మానిస్తూ
శ్రద్ధాంజలి ఘటిస్తున్న. *

# 17. ఎవరు దేశ ద్రోహి ?

ఓ పరాన్న భుక్కు ధన స్వామీ!
ఓ ఛాందస మతవాదీ !
ఓ నూతిలోని కప్పా !
ఎవడురా దేశద్రోహి ?
నీవు తొడుక్కున్న బట్టలు
నీ చేతికున్న రిస్టు వాచి
నీవు వాడుతున్న
రేడియోలు, వీడియోలు
టీవీలు, స్టీరియోలు
నీవుపయోగించే కారు
నీవు చేస్తున్న ఫోను
నీ ఇంటిని వెలుగుమయం చేసిన కరెంటు
స్వదేశీయములే నంటావా ?
దేశ భక్తంటూ గొంతైతే చించుకుంటావు
నీ పిల్లలకు ఇంగ్లీషు మీడియం చదువులు కావాలి.
నీకు తుమ్మొచ్చినా దగ్గొచ్చినా
అల్లోపతి వైద్యమే కావాలి.
నీవు ప్రయాణం చేయడానికి
ఫారినోడు కనుక్కున్న
రైలుబండ్లు విమానాలే కావాలి
ఇవన్నీ స్వదేశీయులు కనుక్కున్న వేనా ?

మరి ఇవి వాడే నీవు
విదేశీ తొత్తువు కావా ?

ఉన్నత సమాజంకొరకు
మనిషిని మనిషిగ చూసే
ఉత్తమ వ్యవస్థకొరకు
మనిషిపై మనిషి దోపిడీని
అంతంచేసే సంఘ స్థాపనకై
మహోన్నత సిద్ధాంతాలను
బోధించే ఉత్తమ గ్రంథాలు
విదేశీయులు రాసినంత మాత్రాన
వాట్ని చదివెటోడు విదేశీ తొత్తా ?

విజ్ఞానం విశ్వవ్యాపితం
దాని కెల్లలంటూ ఉండవని
నూతిలోని కప్పవైన నీకెలా తెలుస్తుంది ?

వాట్ ఇంజన్ థేరీని
విదేశీయమనుకొని ఉంటే
నీవింకా ఎడ్ల బండిమీన్నే
ప్రయాణించేవాడివి.

మనిషి బ్రతుకును సుఖమయంచేసిన
శాస్త్ర విజ్ఞానానికే ఎల్లలుగీస్తే
నీవింకా రాతియుగంలోనే
నివసించేవాడివి.

—కొలువ మల్లియ్య

దేశభక్తి పేరుతో
దేశ ప్రేమ పేరుతో
దేశ ప్రజలను పక్కకునెట్టి
రాయీ రప్పల నమ్ముమని
దేశమంటే మట్టిని
దేశమంటే రాళ్ళని
దేశమంటే చెట్లు గుట్టలని
వెనుకటి మా తాతలు నేతులు తాగిండ్రు
మీకు మూతులు నాకుండ్రని
బోధించే నీవు—

మతం మత్తుతో
కులం పిచ్చితో
దేశ ప్రజలను చైతన్యహీనుల చేసే నీవు
దేశ భక్తుడివైనావా ?

అందరు కష్టపడితే కొందరు సుఖపడే
దుష్ట వ్యవస్థను నిర్మూలించడానికి
సర్వ మానవ సౌభ్రాతృత్వానికి
మనిషినే ప్రమాణంగా తీసుకొని
గోచిపాతరగాళ్ళతో
బక్కచిక్కినవాళ్ళతో
పొట్టకూటికికూడా లేనివాళ్ళతో
సంఘ బహిష్కృతులతో
దీన మానవ జనులందరితో

పాలలో నీళ్ళలా కలిసిపోయ్యి
నీటిలో చేపలా ప్రవర్తిస్తూ
పోరుచేసే వీరులు
దేశ ద్రోహులైనారా?

దేశమాత విదేశీయుల కమ్ముడుబోయి
నడి బజార్లో నగ్నంగా నిల్చొని
హృదయ విదారకంగా విలపిస్తుంటే
దేశ ప్రజలు అన్నంలేక అలమటిస్తుంటే
నిలువ నీడలేక అఘోరిస్తుంటే
కట్టు గుడ్డలులేక కష్టపడుతుంటే
విదేశీయులే దేశ ఆర్థిక వ్యవస్థను కంట్రోల్ చేస్తుంటే
సపోర్టు చేస్తున్న నీవు
కుల మత శీలాలగూర్చి ఉపన్యసిస్తూ
దోపిడీదారుల కొమ్ముగాచే నీవు
దేశ భక్తుడివా?

ఓరి మతోన్మాదీ-
మనిషి బాగోగులు గమనించని నీవే
పచ్చి దేశద్రోహివి.

"దేశమంటే మట్టికాదు
దేశమంటే మనుషులన్న"
మహాకవి మాటలు గుర్తు తెచ్చుకో. *



—కాలువ మల్లయ్య

# 18. సోషలిజం

సోషలిజమా నీకు జోహార్లు
నీ పేరులోనే మహత్యముంది
దాని నుచ్చరించందే ఎవరికీ బ్రతుకులేదు
నిలువ నీడకూడా గతుండదు.

ప్రజాస్వామ్య మనోళ్లను జైల్లో కుక్కుతూ
ప్రజాస్వామ్యానికి సమాధి కడుతూ
కనీస పౌర హక్కులనుకూడా కాలరాస్తూ
న్యాయమైన పోరాటాలను సైతం
నిర్దాక్షిణ్యంగా అణచివేస్తూ
మానవతను మంట గలుపుతూ-

విద్యార్థుల మేధావుల కార్మికులను కర్షకులను
తుదకు అట్టడుగు ప్రజల పక్షాన
కలం పట్టినోన్నికూడా
జైళ్ళపాలు గావిస్తూ
దేశమంతా ఆందోళనలతో
పీనుగు పెంటలను చేస్తూ-

మానవ కంకాళాల మీద నిల్చొని
నరహంతకులైన పాలకులు
సోషలిజం నామజపం చేస్తున్నారు.

గరీబీ హటాయిస్తామంటూ
గరీబులను హటాయిస్తూ
బహు ముద్దుగా సోషలిజం స్థాపిస్తున్నారు.

కుల మత పిచ్చిగాళ్ళు
వర్ణాశ్రమ ధర్మాలను సమర్థిస్తూ
మధ్య యుగాల సంస్కృతిని కోరుతూకూడా
సోషలిజమనే అంటున్నారు.

ప్రపంచం క్రమక్రమంగా
రాచరిక వ్యవస్థనుండి భూస్వామ్య వ్యవస్థకు
భూస్వామ్య వ్యవస్థనుండి పెట్టుబడిదారీ వ్యవస్థకు
పెట్టుబడిదారీ సమాజంనుండి సోషలిజంవైపు
ఎవ్వరాపినా ఆగకుండా
ప్రయాణం చేస్తూనే వుంది

జాతులన్నీ విముక్తమౌతున్నాయి
ప్రజలు సోషలిజాన్ని వాంఛిస్తున్నారు.

అందుకే_

ఎవరి వర్గ స్వభావా లేవైనా
సోషలిజాన్ని కోరుకుంటున్న ప్రజానీకాన్ని మభ్యపెడుతూ
ఓట్లు సంపాదించడానికై
అంతా సోషలిజ నామజపమే చేస్తున్నారు.

సోషలిజమా !

నీ పవిత్ర నామం
అడ్డమైన వాళ్ళందరి నోళ్ళలో పడి
అపవిత్ర మవుతుందని
ఆవేదన చెందుతున్నాను. *

—కొలువ మల్లయ్య

# 19. ప్రగతి

హల్లో !

ఏందా మాటలు ?

గొంతు చించుకో నెందు కరుస్తరు ?

మేమేం ప్రగతి సాధించలేదంటంద్రా ?

ఛా ఛా !

అవి పచ్చి అబద్ధాలు

పెబుత్వమంటె గిట్టనోళ్ళనె మాటలు.

సాతంత్రం అచ్చినంక

దేశ మెంత ముందుకు పొయ్యింది?

మా ప్రజలెంత పైకచ్చిండ్రు ?

పదుల కోట్లల్లున్న ఆస్తులు

వేల కోట్లకు పెరిగినయా? లేదా?

మరి దీన్ని పగ్రితనరా ?

ప్రజలంటె ఈళ్లు కాదా ?

ఎవ్వలెప్పిండ్రు మీకు ?

ఫుట్‌పాత్‌ల మీన పండెటోల్లు

సెత్తకుండీలపొంటి తిరిగెటోల్లు

ఒక్క పూటన్న తిననోల్లు

డొక్కలెండి మాడెటోల్లు

బట్టల్లేక బతికెటోల్లు

ఈళ్ళనుగూడ ప్రజలనుమంటరా ?

చ ఛ ఛా !

ఈల్లు ప్రజలెందుకై తరు ?
పసరాలకంటె ఈనం.

ఏందేంది ?

తలసరి ఆదాయం పెరుగలేదంటుండ్రా?
మీకు సెప్పినోనికి మెదళ్లేదు
మీకు కండ్లులేవు
అయితే ఇనుండ్రి.

హైదరాబా దెప్పుడన్నపోతే
బంజరాహిల్సు బంగులాలు సూడుండ్రి
బొంబై పట్నానికి పొయ్యినప్పుడు
మెరిన్‌డ్రైవ్ కట్టుడాలు సూడుండ్రి-
కలకత్తా నగురానికి పొయ్యి
చౌరంగిలేన్ల, ఎస్ప్లనేడ్ల
మొగుల్నంటుకునె బిల్డింగులు సూడుండ్రి.

గవ్వెన్నెందుకు ?

పార్లమెంటు బంగులానె సూడుండ్రి-
మొన్న మొన్ననే కట్టిచ్చిన
ఆసియాడూరును సూసిరాండిర్రి
ఇవన్ని సూసినంకగూడ
మల్ల గదే మాటంటుండ్రా ?

ఏమంటు రేమంటురు ?

కొందరు వేలు సంపాయిత్తంటె

—కాలువ మల్లయ్య

ఇంకొందరికి కూటికే లేదంటండ్రా ?
తలకు మాసినోని
తలసరి ఆదాయం సూడుమంటరా?
అని తలకే ఇలువ లేదంటె
తలసరి ఆదాయమంటరేంది ?

ససంత్రం అచ్చినంక
బళ్లు గట్టిచ్చినం, గుళ్లు గట్టిచ్చినం
ఇన్‌సాట్లు పంపినం, రోహిన్లు పంపినం
వీడియోలు పెట్టినం, రంగుల టీవీలు పెట్టినం
రైల్లను పెంచినం, ఇమానాలు పెంచినం
ప్యాక్టరీలు కట్టినం, బాంబులు సేసినం
సాంతి బద్రతను కాపాడుటానికి
పోలీసుల పెంచినం, మిలిట్రీని పెంచినం.
ఇవన్ని పేదోనికేం ఒరుగబెట్టినయంటురా ?
ఇదంతెట్లనే ఉన్నదేంది ?
గిన్ని జెప్పినంకగూడ
ఇంక అవాజ్జేత్తండ్ర.
సరె మీ ఇట్టం-
మాకు బందవస్తుగ పోలీసులున్నరు
ఆళ్ళ సేతుల్ల తుపాకులున్నయి
తుపాకులల్ల తూటాలున్నయి.

ఇంక
జేళ్ళుగూడున్నయి
అండ్ల
ఆవాజ్జేసినోల్ల
అవయవాల్దీసేసె
ఆయుధాలుగూడున్నయి.
జాగ్రత్త గుండ్రుండ్రి మరి— *

## 20. కాలుష్యం

కాలుష్యం
అంతా కాలుష్యం
విశ్వమంతా కాలుష్యం.
వాతావరణంలో
విష వాయువుల కాలుష్యం
నీటిలో
విష పదార్థాల కాలుష్యం
మనిషిలో
స్వార్థ పిశాచపు కాలుష్యం
రాజకీయాల్లో
దొంగ సిద్ధాంతాల కాలుష్యం
విప్లవకారుల్లో
దొంగ విప్లవ గూ్రపుల కాలుష్యం *

—కాలువ మల్లయ్య

# 21. దేవుళ్ళు మంచోళ్ళు

దేవుళ్ళు మంచోళ్ళు
చానా చానా మంచోళ్లు
ఎంత మంచోళ్ళంటే
నోట్లో వేలుపెట్టినా చీకలేని
వెన్న పెట్టినా నాకలేని
అమాయకులు.

ఊసినా దుమ్మెత్తి పోసినా
ఆకాశాని కెత్తినా– అధములని తిట్టినా
చలనంలేని దీనులు.

మతకలహాల మారణహోమంలో
మానవత్వాలనే మరచి
కత్తులు నూరుకుంటూ
కదం త్రొక్కుతూ
అమానుషంగా హత్యలు చేసుకున్నా
రక్తం ఏర్లయి పారినా
కులమత యుద్ధాల పేరుతో
పుర్రె లెగురగొట్టుకున్నా
నోరైనా మెదపరు.

ఒకరి ఆలయాల నొకరు మట్టుబెట్టినా
విగ్రహాలను ధ్వంసం చేసినా
ఆడవాళ్ళను చెరబట్టినా
పెదవైనా కదపరు.

ప్రార్థనాలయాలే
ఆయుధ భాండాగారాలైనా
దేశ ద్రోహులకు జాతి విద్రోహులకు
ఆవాస కేంద్రాలైనా
కదలరూ మెదలరు.

తమ ఆలయాలే
పచ్చి వ్యభిచార కేంద్రాలైనా
వ్యాపార కేంద్రాలైనా
అన్యాయా లక్రమా లవినీతి అవిచ్ఛిన్నంగా సాగినా
మౌనమే వహిస్తారు.
చర్చే గొప్పదని
మసీదే గొప్పదని
గుళ్ళే గొప్పవని
అమాయకుల మభ్యపెడుతూ
బలవంతపు మత మార్పిల్లు జరిపినా
డబ్బుకు అమాయకు లమ్ముడుబోయినా
స్వార్థం స్వైరవిహారం చేసినా
చూస్తూనే వుంటారు.

అయినా వాళ్లు
మహిమాన్వితులుగానే పొగడబడుతుంటారు.
మనిషి అజ్ఞానంలోంచి సృష్టింపబడ్డ దేవుడు
ఉన్న వాళ్ళ ప్రయోజనాలను కాపాడే ఊహాజనిత బొమ్మ
మహిమాన్వితుడు కాకుండా ఎలా వుంటాడు? *

—కాలువ మల్లయ్య

# 22. (అ) భాగ్యనగరం

భాగ్యనగరమా ?
కాదిది అభాగ్య నగరం.

ఇక్కడ
నాగరికుల వేషాలలో ఉన్న
అనాగరికుల విద్వేషాగ్నిలో
మతమౌఢ్యుల దురహంకారంలో
రాజకీయుల స్వార్థ ప్రయోజనంలో
సామాన్యుడి బ్రతుకు
విచ్చుకత్తుల మధ్య విహారం.
క్షణక్షణం దినదినం ఒక గండం.
కూరగాయల కెళ్ళిన గృహిణి
ఆఫీసు కెళ్ళిన అన్న
పాఠశాల కేగిన పాప
షాపింగు కెళ్ళిన యజమాని
తిరిగొస్తారన్న నమ్మకం లేదు
ఏ సందిలో ఏమౌతుందో
ఏ గొంది భీకర సంగ్రామ స్థలమవుతుందో
ఏ క్షణం ఎవరి రక్తం ఏరులై పారుతుందో
ఏ అమాయక ప్రాణి
ఏ మతోన్మాది కత్తి కెరయైపోతాడో
ఎవరికీ తెలియదు.
సమతను త్రుంచి మత విద్వేషాన్ని రెచ్చగొట్టే కుక్కల
తరిమి తరిమి కొట్టందే
అభాగ్యనగరం భాగ్యనగరం కాదు. *

# 23. గంగా జలం

సర్వరోగ నివారిణి
సర్వపాప సంహారిణి
పావన గంగోదకం
సేవించి తరించండి.

మీరెన్ని దొంగతనాలు చేసినా
పచ్చి హంతకులైనా
పరుల దోచి బొర్రలు పెంచినా
పరమ కిరాతకపు పనులు చేసినా
ఏమాత్రం ఫరవాలేదు
గరిటెడు గంగోదకం సేవిస్తే చాలు
మీ పాపాలు పటాపంచలై పోతాయి
మీరు పరమ పవిత్రులై పోతారు.

దేశంలోని
అంతులేని నిరుద్యోగ సమస్యకు
అంతఃకలహాల మారణ హోమానికి
ఆకలి పీడనల అలమటింపులకు
విశృంఖల స్వార్థ చింతనకు
నివారణోపాయం కనుగొన్నాం
దేశమంతటా గంగోదకం పంచుతున్నాం
దేశ సమస్యలన్నీ మటుమాయమై పోతాయి–
"సర్వే జనే సుఖినోభవంతు"
అందుకే సేవించండి పవిత్ర గంగోదకం. *

—కాలువ మల్లయ్య

# 24. ఆకలి నాలుకలు

తాడితులూ, పీడితులూ
బక్కోళ్లూ బాంచెగాళ్లు
డొక్కలెండి మాడెటోళ్లు
పక్కబొక్కలెల్లినోళ్లు
అణగిమణగి వున్నోళ్ళు
ఆకలి నాలుకలవాళ్ళు
కండ్ల నెర్ర జేత్తుండ్రు
గుండ్ల కెదురు నిలుస్తుండ్రు.

పీడన ఇక సాగదనీ
దోపిడనలె ఉండొద్దని
పుక్కానికి బతికెటోళ్ళ
శ్రమ శక్తిని దోచెటోళ్ళ
తరిమి తరిమి కొట్టుటకై
అలుగుటన్నదే ఎరుగని
అజాత శత్రులగుతుండ్రు
అగ్నికణా లవుతుండ్రు.

సకల విధ సంపదలకు
సృష్టికర్తలైనవాళ్లు
తమ సంపదననుభవింప
తరలి తరలి వస్తున్నరు
కెరటాలై లేస్తున్నరు
మోసపు మాటలను త్రోచి
మునుముందుకె కదులుతుండ్రు
తమ రాజ్యం స్థాపించనుండ్రు.